# అవసరాలకైన అస్థిత్వం క్రైస్తవ్యమా?

నేటికి క్రీస్తు చనిపోయి సుమారు 1974 సం॥లు కావచ్చినప్పటికీ, క్రైస్తవ్యం ఇంకనూ శరవేగంతో ప్రపంచ దేశాల్లో తన ఉనికిని ఎంత పటిష్టం చేసుకొన్నదో నేటి ప్రపంచ స్థితిని ఆలోచించినట్లయితే స్పష్టంమగుచున్నది. నేటి ప్రపంచ జనాభా సుమారు 600 కోట్లకు పైగా ఉన్నప్పటికీ, అందు క్రీస్తును నమ్మి క్రైస్తవ్యాన్ని స్వీకరించిన వారు 200 కోట్లకు పైగా అత్యధిక జనాభాగా ఉండటం హర్షనీయం. ఇంతగా విస్తరించుచున్న క్రైస్తవ్యపు ప్రారంభాన్ని మనము బైబిలు గ్రంథం నందు పరిశీలించినట్లయితే దీనికి ఆయుష్షును పోయుటకు తమ ధన, మాన ప్రాణాలను సమర్పించిన ఎందరో త్యాగశీలురను విశ్వాస వీరులను మనం గమనించగలము. నేటి ప్రపంచ ప్రజలకు క్రైస్తవ్యము అన్నది చాలా సుళువుగా స్వీకరించ వచ్చునను అభిప్రాయం కలిగి ఉండటం దుఃఖించ తగ్గ విషయం. నేటి క్రైస్తవుల నాడిని పరిశీలించ గలిగితే నేను క్రైస్తవ కుటుంబంలో పుట్టానంటూ, మా తాతల నుండీ మేము క్రైస్తవులమేనండీ అని చెప్పుకొంటూ ఉంటారు. నిజానికి క్రైస్తవ్యం రక్తాన్ని బట్టి, శరీరాన్ని బట్టి, వంశాన్ని బట్టి మాత్రము వచ్చేది కాదు. తండ్రి యొక్క ఆస్థులను, సొత్తులను హక్కుగా పొందినట్లు పారంపర్యంగా సంక్రమించేది కాదు క్రైస్తవ్యం. తండ్రి క్రైస్తవుడైనా పిల్లలు అవిశ్వాసులుగా ఉండడం నేటి సమాజంలో ఎంతో మందిని చూడగలం. అలాగే భార్య విశ్వాసియైనా భర్త, అత్తమామలు అవిశ్వాసులుగా ఉండటం మనం గమనించగలం దీనిని బట్టి క్రైస్తవ్యం అనేది ప్రతి మనిషి తనకు తానుగా పొందవలసినదే లేక స్వీకరించవలసినదే తప్ప బలవంతంగా ఎవరూ దీనిని కట్టబెట్టలేరు లేక తండ్రి తదనంతరం పిల్లలకు స్వాస్థ్యంగా వచ్చేది మాత్రం కాదని ఖచ్చితంగా చెప్పగలం, ఏ వ్యక్తి అయితే తన మనస్సు మారి, క్రీస్తును రక్షకునిగా అంగీకరించి క్రీస్తు నామంలో బాప్తీస్మం పొందుతాడో వాడే క్రైస్తవునిగా పిలువబడుటకు అర్హత ఉందిగాని కేవలం గర్భాన్న జన్మించినంత మాత్రాన క్రైస్తవ్యం రాదు.

(అపొ.కా. 11:21,26) - ప్రభువు హస్తము వారికి తోడైయుండెను గనుక నమ్మిన వారనేకులు ప్రభువు తట్టు తిరిగిరి. వారు కలసి యొక సంవత్సరమంతయూ సంఘములో ఉండి బహుజనులకు వాక్యమును బోధించిరి. మొట్టమొదట అంతియొకయలోని శిష్యులు క్రైస్తవులనబడిరి.

పై వాక్యాన్ని ఆలోచించినట్లయితే ప్రభువు వాక్యము విని, ఆయన వైపు తిరిగి విశ్వసించి, సంఘముగా ఉంటూ ఎవరైతే వాక్య ప్రకటనలో ఉంటారో వారే క్రైస్తవులుగా పిలువబడినట్టు ఇక్కడ మనకు అర్థమగుచున్నది. గనుక ఇన్ని జరిగితేనే గాని క్రైస్తవులుగా పిలువబడుటకు అర్హత లేదని బైబిలు ఘోషించుచుండగా కేవలం క్రైస్తవ కుటుంబంలో పుట్టినంత మాత్రాన క్రైస్తవులవుతారన్నది అర్థరహితం.

క్రీస్తు వచ్చి 2007 సం॥లు గతించినా క్రైస్తవ్యం పునాది కలిగి ఈ ప్రపంచంలో నిలువగలిగిందంటే దీనికి మూలరాయియైన క్రీస్తు యొక్క పునాది మీదనే నేటి క్రైస్తవులు మహాదుర్గముగా కట్టబడుచున్నారు.

(1కొరింథీ 3:11) వేయబడినది తప్ప మరొక పునాది ఎవడును వేయనేరడు. ఈ పునాది యేసుక్రీస్తే. (ఎఫెసి 2:20,21) క్రీస్తు యేసే ముఖ్యమైన మూలరాయియై యుండగా అపొస్తలులు, ప్రవక్తలును వేసిన పునాది మీద మీరు కట్టబడియున్నారు.

క్రీస్తు, అపొస్తలులు, ప్రవక్తలైన వారందరూ క్రైస్తవ్యానికి పునాదిరాళ్ళుగా ఉండుటకు తమ జీవితాలనే త్యాగం చేసి దేవుని కొరకు పణంగా పెట్టి ఈ క్రైస్తవ్యాన్ని మన తరాలకు ప్రసాదించారు గనుకనే నేటికినీ అది ఆయుష్షు కలిగి ఉందనుటలో సందేహం లేదు. క్రైస్తవ్యం మొదటి శతాబ్దంలో నిలువబడుటకు ఎంతో రక్తపాతాన్ని చవిచూసి, ఎదుర్కొనవలసివచ్చింది. కఠినమైన రోమా ప్రభుత్వం క్రీస్తును ప్రకటించకూడదని, క్రైస్తవ్యాన్ని అణగద్రొక్కుటకు చేసిన విశ్వ ప్రయత్నాలలో ఎందరో భక్తులు తమ ప్రాణాలనే ఫణంగా దేవునికి సమర్పించి నాటి క్రైస్తవ్యానికి ఆయువును పోసారు. క్రైస్తవ్యాన్ని పరిచయం చేసిన క్రీస్తును క్రూరంగా శిలువనెక్కించింది, శరవేగంతో నిజృంభించిన స్తెఫెనును

రాళ్ళతో కొట్టి చంపింది యోహాను సహోదరుడైన యాకోబును ఖడ్గంతో చంపింది. పౌలును, పేతురును మిగిలిన అపొస్తలులను చెరసాలపాలు చేసి హింసించి హత సాక్షులుగా మార్చింది. ఇన్ని కఠినమైన హింసలను ఓర్చుకొని క్రైస్తవ్యాన్ని ప్రపంచంలో నిలువ బెట్టుటకు తమ సర్వస్వాన్ని త్యాగం చేసి బలిగావించబడ్డారు ఎందరో ప్రారంభ క్రైస్తవులు. ప్రారంభ క్రైస్తవ సంఘానికి ఎన్నో కఠినమైన శ్రమలు ఎదురైనప్పటికీ తాము నమ్మిన క్రీస్తును విడువక తమ ప్రాణాలనైనా ఇచ్చుటకు సిద్ధపడింది ఒకనాటి క్రైస్తవ ప్రపంచం మరి నేడు క్రైస్తవులం అని పిలువబడుతున్న నేటి క్రైస్తవుల స్థితి ఎలా ఉందో ఒక్కసారి ఆత్మ విమర్శ చేసుకుంటే మనము ఎంతవరకూ క్రైస్తవ్యానికి న్యాయాన్ని చేకూర్చగలుగుతున్నామో విశదమవుతుంది. అనాడు మొదటి శతాబ్దపు క్రైస్తవులు అనుభవించిన శ్రమలలో ఎన్ని వంతుల కష్టాల్ని నేటి క్రైస్తవులు అనుభవించుచున్నారు. పరిశీలన చేయవలసి ఉంది బాప్తీస్మం పొందినంత మాత్రాన క్రైస్తవులము అని అనుకుంటే పొరబడుచున్నారనే చెప్పాలి. మన చేతిలో నున్న బైబిలును పరిశీలించగలిగితే క్రైస్తవుడైన వానికి ఉండవలసిన అర్హతను ఎంత చక్కగా వివరించుచున్నదో గమనించగలము.

(1పేతురు 4:16) ఎవడైనను క్రైస్తవుడైనందుకు బాధ అనుభవించిన యెడల అతడు సిగ్గుపడక, ఆ పేరును బట్టియే దేవునిని మహిమ పరచవలెను.

పైన తెలుపబడిన బైబిలు అర్హత కలిగి ఎంతమంది క్రైస్తవులు తాము నమ్మిన క్రైస్తవ్యాన్ని నిలువ బెట్టుటకు శ్రమ పొందుచున్నారో ఆత్మ విమర్శ చేసుకోవాలి. క్రైస్తవ్యాన్ని ఎవరైనా స్వీకరించారంటే వారు శ్రమ అనుభవించుటకు నియమింపబడినవారని, క్రైస్తవుడై బాధ అనుభవిచాలని ఎంత మందికి తెలుసు? ఆదివారమునాడు ఒక్క రోజు నాలుగు గోడల మధ్య ఫ్యాన్ క్రింద చెమట పట్టకుండా కూర్చోని కొద్దిసేపు వాక్యం విని, ఆ తరువాత వారికి మిగిలినది కానుక రూపంలో దేవుని ముఖాన్న వేసి ఇంటికి తిరిగి వచ్చేయడమే క్రైస్తవ్యం అని భ్రమపడి, మోసపోతున్నారు. నేటి క్రైస్తవులు దేవుని కోసం ఎంత కష్టం అనుభవించు చున్నారో ఒక్కసారి పరిశీలన చేసుకొనండి. నేటి క్రైస్తవులవలె సుఖపడడం మొదటి శతాబ్దపు క్రైస్తవులు కూడా నేర్చుకుంటే నేడు క్రైస్తవ్యానికి రూపమే ప్రపంచంలో లేకుండా పోయేది. సుఖాలకు అలవాటుపడ్డ నేటి క్రైస్తవజాతే మొదటి శతాబ్దంలో ఉంటే ఏనాడో క్రైస్తవ్యం మట్టిపాలై ఉండేది. ప్రభుత్వమే వారికి వ్యతిరేకంగా ఉన్నా, సంఘాలలో ఉన్న స్త్రీ, పురుషులను చెరసాలలో వేసి హింసిస్తున్నా చలించక, భక్తిని విడిచి పెట్టక ప్రాణాలు సయితం అర్పించిన వారిదే అసలు సిసలైన క్రైస్తవ్యం చిన్న బాధ కలిగిన వెంటనే ఎందుకండీ ఈ దేవుడు, నాకు ఏ మేలు జరుగలేదని కేవలం మేలుల కోసమే క్రీస్తును నమ్మిన ఈ క్రైస్తవ జాతి క్రైస్తవులంటారా? ఆలోచించండి.

పరలోక రాజ్యంలో ప్రవేశించడం చాలా సుళువని క్రైస్తవ్యం భావిస్తుంది. నేటి క్రైస్తవ్యానికి, ఆనాటి క్రైస్తవ్యానికి ఎంత వ్యత్యాసముందో ప్రియదేవుని పిల్లలారా మీరంతా గమనించాలి.

(అపొ.కా. 14:22) శిష్యుల మనస్సులను దృఢపరచి విశ్వాసమందు స్థిరముగా ఉండవలెననియు, అనేక శ్రమలు అనుభవించి మనము దేవుని రాజ్యములో ప్రవేశింపవలెనని వారిని హెచ్చరించిరి.

పై మాటను బట్టి అనేక శ్రమలను క్రైస్తవులు అనుభవిస్తేనే తప్ప పరలోకానికి చేరరన్న వాస్తవాన్ని బైబిలు ఖచ్చితంగా చెప్పుచుండగా, పరలోకం చేరిపోతామన్న అమాయకపు నమ్మకంతో దేవుని కొరకు కష్టపడలేని క్రైస్తవులు పరలోకం చేరుతారంటారా?

బాప్తీస్మం తీసుకున్న తరువాత క్రైస్తవులు దేవుని కొరకు వారు అనుభవించుచున్న బాధలేమిటో ఆలోచించండి? నీ కుటుంబంలో ఎవరికైనా రోగం వస్తే అది దేవుని కొరకైన శ్రమా? నీ ఇంట్లో నీ పిల్లలకు పెళ్ళికానంత మాత్రాన అది దేవుని కొరకు శ్రమా? నీకు ఉద్యోగం లేక, తిండి కోసం, నీ కడుపు కోసం నీవు పడుతున్న ఆరాటం దేవుని కొరకైన శ్రమా? నేటి క్రైస్తవులు తమ కొరకు సమాజంలో శరీర సంబంధమైన శ్రమలనుభవిస్తూ ఇవన్నీ దేవుని కోసమేనంటూ ఒక తప్పుడు అభిప్రాయంలో ఉన్నారు. కాని మొదటి శతాబ్దపు క్రైస్తవులు ఎన్నడూ ఇటువంటి శ్రమలు అనుభవించి, దేవుని కొరకని చెప్పలేదు, సువార్తను ప్రకటించుటకు, తాము క్రైస్తవులమని పిలువబడుటకు తమ ధనాన్ని సమర్పించి చివరకు

ప్రభుత్వాన్నయినా ఎదిరించి తమ ప్రాణాలనే పణంగా పెట్టి దేవుని కోసం శ్రమలు అనుభవించినవారే నిజముగా క్రైస్తవులని పిలువబడుటకు అర్హులు గాని ప్రొద్దున్న లేచినప్పటి నుండి రాత్రి పడకకు చేరునంతవరకూ నీ కోసం, నీ పిల్లలు బ్రతుకుల కోసం, కష్టపడి నీ జీవనం కొరకు ఆత్రుత కలిగి ఉండటం దేవుని కొరకైన శ్రమంటారా? దేవుని పిల్లలారా, మనము నిజముగా దేవుని కోసం ఆయన రాజ్య సువార్త వ్యాప్తి కొరకు మన సుఖాన్ని సంతోషాన్ని త్యాగం చేసి, మన ధనాన్ని వెచ్చించి అనేకులకు వాక్యాన్ని ప్రకటిస్తున్నప్పుడు ఎదుర్కొనే బాధలే అసలు సిసలైన శ్రమలు, ఇప్పుడు మన భారతదేశంలో మత స్వాతంత్ర్యం ఉంది గనుక నీ కిష్టమైన ప్రాంతంలో వాక్యాన్ని ప్రకటించవచ్చు. ఒక వేళ క్రీస్తును ప్రకటించడానికి వీలులేదని ప్రభుత్వమే ఒక చట్టాన్ని అమలు చేస్తే అప్పుడు ఎందరు క్రైస్తవులు క్రీస్తును ప్రకటించగలరు? పరిస్థితులు అనుకూలించినప్పుడు ప్రకటించడం సుళువేగాని గడ్డుకాలంలో నీవు నీ దేవుని కొరకు నిలువబడగలవా? మన దేశంలో కొన్ని రాజకీయ పార్టీలు, క్రైస్తవ్యానికి విరోధులైన వారు క్రీస్తు ప్రకటింపబడకూడదని, క్రైస్తవులు ఈ దేశంలో ఉండకూడదని ఎన్నో ఆలోచనలతో చట్టాలు చేయటానికై అవకాశం కొరకు ఎదురు చూస్తున్నారు. వారే గనుక అధికారంలోనికి వస్తే ఆ సమయంలో నీవు నీ క్రీస్తును ప్రకటించగలవా? నీ క్రీస్తు కోసం శ్రమ అనుభవించగలవా?

(మత్తయి 10:22) మీరు నా నామము నిమిత్తము అందరిచేత ద్వేషింపబడుదురు. అంతము వరకూ సహించినవాడు రక్షింపబడును.

ఓ క్రైస్తవుడా! అంతము వరకూ సహించుటకు, క్రీస్తు కొరకు శ్రమ పడుటకు నీవు సిద్ధముగా ఉన్నావా? ఆలోచించుకో శరీర సుఖాల కొరకో, అవసరాల కొరకో క్రీస్తును స్వీకరించక నిజమైన క్రైస్తవునిగా క్రీస్తు కొరకు క్రైస్తవ్యాన్ని నిలబెట్టుట కొరకు మొదటి శతాబ్దపు క్రైస్తవుల్లా సమస్తాన్ని త్యాగం చేయటానికి సిద్ధపడేవాడే క్రైస్తవుడుగా పిలువబడుటకు అర్హత కలిగినవాడు.

నేటి యుగంలో ప్రపంచ వ్యాప్తంగా కోట్లాది మంది అత్యధిక జనాభాలో క్రైస్తవులుగా ఉన్నా వారంతా క్రైస్తవులని మనం భావిస్తే అది పొరపాటే. కోట్లమంది ఆయన్ని నమ్మినంత మాత్రమున వారంతా క్రైస్తవులు కాలేరు. మొదటి శతాబ్దంలో క్రీస్తు, క్రైస్తవ్యం యొక్క భవిష్యత్తును చక్కగా వివరించారు. సంఖ్యలో అధిక శాతంలో ఉన్నంత మాత్రాన వారంతా క్రైస్తవులని తలస్తే పొరపాటు. అలాగయితే క్రీస్తును కూడా లక్షలకొలది జనసమూహాలు వెంబడించిన వారు వారిని గూర్చి ఆయన మాట్లాడుతూ ఈలాగున పలికాడు.

(లూకా 13:23,24) ఒకడు ప్రభువా, రక్షణ పొందువారు కొద్ది మందేనా, అని ఆయనను అడుగగా, ఆయన వారిని చూచి ఇరుకు ద్వారమున ప్రవేశింప పోరాడుడి, అనేకులు ప్రవేశింపజూతురు గాని వారి వలన కాదని మీతో చెప్పుచున్నాను.

పై క్రీస్తు మాటలను బట్టి పరలోకం చేరేవారి శాతం అతి స్వల్పంగానే కనబడుతుంది. ఎందుకనగా పేరుకు మాత్రమే క్రైస్తవులుగా పిలువబడుతూ దేవుని కొరకు ఏ కష్టమునూ అనుభవించని క్రైస్తవులను పరలోకం చేర్చడం న్యాయమంటారా? క్రీస్తు ఈ లోకానికి రెండవసారి వచ్చునప్పటిక ప్రపంచ స్థితి ఎలా ఉంటుందో ఆయన వివరిస్తున్నాడు.

(లూకా 18:8) అయినను మనుష్య కుమారుడు వచ్చునప్పటికి ఆయన భూమి మీద విశ్వాసము కనుగొనునా?

భూమి మీద అసలు సిసలైన విశ్వాసం కలిగి ఉండువారు చాలా కొద్దిమందనే చెప్పాలి. మరి అత్యధిక శాతంలో ఉన్న క్రైస్తవులు విశ్వాసులు కారంటారా? వారికున్నది విశ్వాసం కాదంటారా? నేటి ప్రపంచ క్రైస్తవుల సాక్ష్యాలను మనం ఆలోచించగలిగితే వారు పలికే మాటల్లో ఎంత స్వార్థం దాగి ఉందోనన్న సత్యాన్ని చాలా సుళువుగా గ్రహించగలము. క్రైస్తవులు పలికే సాక్ష్యాలలోని కొన్నింటిని ఈ క్రింద వ్రాయుచున్నాను.

- నాకు భయంకరమైన వ్యాధి ఉండేదండి. ప్రభువు ఆ రోగం నుండి విముక్తి ప్రసాదించాడు. గనుక నేను ప్రభువును నమ్ముకున్నానండి.

- నాకు పిల్లలు కలగడం వలన ప్రభువును నమ్మానండి

- నాకు ఉద్యోగం వచ్చింది గనుక ప్రభువును నమ్మానండి.

- నేను మృతువ్యవు నుండి తప్పించబడ్డాను గనుక ప్రభువును నమ్మానండి.

- తప్పిపోయిన నా బిడ్డను నా దేవుడు మరలా అనుగ్రహించాడు గనుక ప్రభువును నమ్మానండి.

- కోర్టులో ప్రభువు నాకు విజయం ప్రసాదించిన నాటి నుండి ప్రభువును నమ్ముకున్నానండి అని కొందరు చెప్పుకుంటూ ఉంటే మరికొందరు.

- ప్రభువు దయవలన ఇల్లు కట్టానండి.

- ప్రభువు దయవలన పొలం కొన్నానండి.

- ప్రభువు దయవలన పాస్ అయ్యానండి అంటూ మొదలైన అనేక శరీర సంబంధమైన అవసరాలు తీరినందున ప్రభువును నమ్మితినని సాక్ష్యం చెబుతుంటారు.

ప్రభువు దయ ఒక్క క్రైస్తవుల మీదే ఉంది అనుకుంటే మరలా క్రైస్తవులు పొరబడుచున్నారనే చెప్పాలి. ప్రభువు క్రైస్తవుల పట్లే మేలులు జరిపించుటకు ఆయన పక్షపాతి కాదు.. నేటి క్రైస్తవుల్లాగే ప్రపంచంలో దేవునిని నమ్మని వారు సహితం క్రైస్తవులకంటే ఎక్కువగా ఇల్లులు కడుతున్నారు, కోర్టులలో విజయాలు సాధిస్తున్నారు. పిల్లలను కంటున్నారు, ఉద్యోగాలు సంపాదిస్తున్నారు తప్పిపోయిన తమవారిని పొందుతున్నారు ఇంకా ఎన్నెన్నో మరి వీరందరి మీద ప్రభువు దయ లేదంటారా?

(మత్తయి 5:45) ఆయన చెడ్డవారి మీదను మంచివారి మీదను తన సూర్యుని ఉదయింపజేసి, నీతిమంతుల మీదను అవినీతి మంతుల మీదను వర్షము కురిపించుచున్నాడు.

దేవుడు, తండ్రిగా ప్రపంచంలోని తన పిల్లలందరి పట్ల చాలా ప్రేమను కురిపించు చున్నప్పుడు కేవలం నీకే జరుగుచున్నవని చెప్పుటలో అర్థం లేదు. అలాగున జరిగినందుకే నీవు దేవునిని నమ్మితే నీ నమ్మిక సరియైనది కాదు.

తమకు మేలు జరిగినందుకే క్రీస్తును నమ్మామని చెప్పుకుంటున్నారంటే స్వార్థంతోనే క్రీస్తును నమ్మారని మనకి తేటతెల్లమగుచున్నది. ఒకవేళ తమకు ఆ మేలే జరుగకపోతే ఖచ్చితంగా వీరు దేవునిని నమ్మక ఉండేవారు. అవసరాలకొరకై తండ్రిని వాడుకొనేవారు పిల్లలు కాగలరా? మీరే ఆలోచించండి. ఒకనాడు ఉన్నత స్థితిలో ఉన్న కుటుంబం కొన్ని అనివార్యకారణాల వలన నష్టాలలో కూరుకుపోయి తమ ఉన్నత స్థితిని పోగొట్టుకున్న అనంతరం లేమిలో ఆ ఇంటి యజమాని లేక తండ్రి పిల్లలకు, భార్యకు కనీస సౌకర్యాలు అందించనంత మాత్రాన ఆయన యజమాని, తండ్రి కాకుండా పోతాడంటారా? ఏవో కారణాల వలన ప్రేమున్నా వారి అవసరతలు తీర్చలేని నిస్సహాయ స్థితిలో ఉన్నంతమాత్రాన ఆయనపై ఆ కుటుంబ సభ్యులు ప్రేమను చంపుకోవటం న్యాయమంటారా? ఇది ఎంత వాస్తవమో నీ పరలోకపు తండ్రి ద్వారా నీకు ఒక వేళ మేలు జరుగక పోతే ఆయనను తండ్రిగా స్వీకరించలేరా? వీరి మనస్సులను పరిశీలించినట్లయితే కేవలం శరీర సంబంధమైన స్వార్థంతో కూడిన ప్రేమను కలిగి దేవుని నమ్మారనుటకు సందేహం లేదు. అందు నిమిత్తమై ఒక చక్కని మాటను దేవుడు వ్రాయించాడు.

(1కొరింథీ 15:19) ఈ జీవిత కాలము మట్టుకే మనము క్రీస్తునందు నిరీక్షించువారమైన యెడల మనుష్యులందరికంటే దౌర్భాగ్యులమై యుందుము.

పై మాటలలోని భావం మీకు అర్థమై ఉంటుందని భావిస్తున్నాను ఈ కొద్ది జీవితకాలంలోని శరీర అవసరాలను తీర్చుకొనుటకే మనము క్రీస్తును నమ్మి, నిరీక్షించినవారమైన యెడల ప్రపంచ మానవులందరికంటే దేవుని దృష్టిలో దౌర్భాగ్యులమగుదుమని దేవుడు సెలవిచ్చుచున్నాడు. తమ తండ్రి వలన మేలు జరుగుతుందనే తండ్రిని నమ్మే పిల్లలు ఆయన పిల్లలు కారు. దేవుడు అన్ని సందర్భాలలోనూ మేలునే జరిగిస్తాడనుకుంటే అది పొరపాటు ఆయన నిన్ను ఎప్పుడైనా పరీక్షించినచో కీడును అనుభవించటానికైనా సిద్ధంగా ఉండాలని బైబిలు చెబుతుంది.

(యోబు 2:10) అందుకు యోబు - మనము దేవుని వలన మేలు అనుభవించుదుమా, కీడును అనుభవింపతగదా అనెను. పై మాటలోని సారాన్ని నేటి క్రైస్తవ్యం నిజంగా గ్రహించగలిగితే దేవుని వలన మేలులు అనుభవించడానికే అలవాటుపడ్డ వీరు ఇకమీదట కీడును కూడా అనుభవించటాని సిద్ధపడాలని అర్ధమగుచున్నది. దీనిని బట్టి నేటి క్రైస్తవ్యం ఎంత భయంకరమైన వక్రమార్గంలో ప్రయాణిస్తుందో దయతో గమనించండి. నీకు మేలు జరిగితేనే దేవునిని నమ్ముతావా? లేకుంటే నమ్మవా? నీకు ఉద్యోగం వచ్చింది గనుక ప్రభువును నమ్ముకున్నావని చెప్పుకుంటున్న నీవు ఒకవేళ రోగమే ముదిరితే ప్రభువును స్వీకరించవా? తీరా ప్రభువును నమ్ముకున్న తరువాత ఉన్న ఉద్యోగం పోతే, లేని రోగం నీకు వస్తే, నీ బిడ్డలు చనిపోతే నమ్మిన ప్రభువును వదిలేస్తావా? ప్రియ పాఠకులారా, కేవలం మేలులను అనుభవించడానికే సిద్ధపడ్డ ఈ క్రైస్తవులు, అసలు క్రైస్తవులంటారా? క్రీస్తు శిలువ మీద నిస్సహాయునిగా చనిపోతూ - నా దేవా, నా దేవా నా చెయ్యెందుకు విడిచావయ్యా? అని ప్రశ్నిస్తున్నప్పుడు దేవుడు అంత కీడు జరుగుతున్నా ఎందుకు చలించకుండా ఉన్నాడో ఎప్పుడైనా ఆలోచించారా? నీ చేయి పట్టుకొని నిన్ను లేవనెత్తిన దేవుడే ఒకానొక సమయంలో నీ చేయిని విడిచి పెట్టే అవకాశం కూడా ఉందని మర్చిపోకండి అలా చేయిని విడిచిపెట్టిన సమయమే నీవు ఆయన కొరకు నిలువబడే గడియని తెలుసుకొని శ్రమపడుటకు సిద్ధపడగలవా? సుఖాలను అనుభవించడం, అవసరాలను తీర్చుకోవడం క్రైస్తవ్యం అని నీవనుకుంటే నీవసలు క్రైస్తవుడవే కాదు, నీవు బైబిలును నమ్మటం లేదు.

(2తిమోతి 3:12) క్రీస్తు యేసునందు సద్భక్తితో బ్రతుకనుద్దేశించిన వారందరు హింసనొందెదరు.

నీవు నిజమైన క్రైస్తవునిగా, భక్తితో క్రీస్తు కొరకు క్రైస్తవ్యంలో సాగాలంటే నీవు హింసనొందక తప్పదు. ఇప్పుడు చెప్పండి కోటాను కోట్లుగా ప్రపంచంలో అత్యధిక జనాభాలో విస్తరించిన క్రైస్తవులంతా క్రైస్తవులేనా? వీరందరూ పరలోకానికి అర్హులంంటారా? నాటి నేటి జన సమూహముకు, తేడా ఉందంటారా? లేదా నేడు, వీరంతా యేసుని వెంబడించుటలో ఉద్దేశం కేవలం వారి శరీర అవసరతలను తీర్చుకొనుటకు మాత్రమే.

క్రీస్తు బ్రతికున్న కాలంలో ఆయనను వెంబడించిన జన సమూహం కేవలం తమ అవసరాలను ఆయన దగ్గర తీర్చుకొనుటకే వెంబడించు చున్నారన్న సంగతి క్రీస్తు ఎరిగినవారై వారిపట్ల ఎటువంటి కఠినమైన పదాలను ప్రయోగించాడో బైబిల్ నందు గమనించగలరు.

(యోహాను 6:26) యేసు మీరు సూచనలు చూచుట వలన కాదు, గాని రొట్టెలు భుజించి తృప్తి పొందుటవలననే నన్ను వెదకుచున్నారని మీతో నిశ్చయముగా చెప్పుచున్నాను.

దీన్ని బట్టి యేసు మాటలోని భావాన్ని సులువుగా గ్రహించవచ్చును. వారు గుంపులు, గుంపులుగా ఆయన దగ్గరకు చేరివచ్చారంటే ఆయన వాక్యం కొరకు కాదుగాని తమ అవసరాలను తీర్చుకొనుటకే ఆయనను వెంబడిచారని స్పష్టమగుచున్నది మరి ఈనాటి క్రైస్తవులూ, అదే బాట. నేడు "సువార్త సభల" కన్నా "స్వస్థత సభల" కే ఎక్కువ జనం ఎగబడుచున్నారు గనుక సమూహాలుగా ప్రజలను తమ సభలకు ఆకర్షించుకొనుటకు ఆ ప్రజల నాడిని ఎరిగిన సదరు దొంగ భక్తులు - ప్రజల శారీరక అవసరతలు తీర్చుటకే వచ్చామన్నట్లుగా ప్రకటనలిస్తూ అమాయకులను మోసగించుచున్నారు. అనగా క్రీస్తు వలన మీ అవసరాలు తీరే ఒక సదవకాశమన్నమాట. మీ రోగాలను నయం చేసుకోడానికి, మీ సమస్యలను తీర్చుకోవడానికి ఖర్చులేని, సులువైన మార్గం గనుకనే స్వస్థత సభలకు ఉండే జన సందోహం సాధారణ క్రైస్తవ సువార్త సభలకు ఉండరు. మేలుల కోసమే ఆనాడు క్రీస్తునొద్దకు వచ్చిన వారిని గూర్చి క్రీస్తు బైబిలులో ఏమని ఖండించుచున్నారో చూడండి. పరిశీలనగా చూస్తే వారెందుకు క్రీస్తును వెంబడించారో మీకు తేటపడుతుంది.

(యోహాను 6:2) రోగుల యెడల యేసు చేసిన సూచక క్రియలను చూచి బహుజనులు ఆయనను వెంబడించిరి

(యోహాను 12:18) అందుచేత యేసు ఆ సూచక క్రియలు చేసెనని జనులు విని ఆయనను ఎదుర్కొన బోయిరి.

మంచి వాక్యాన్ని బోధించినందుకు కాదుగాని వీరి అవసరాలు తీరే పనులు యేసు చేస్తున్నాడని విని చూచి

జనులు ఆయన దగ్గరకు వచ్చారు.

(మార్కు 3:7,8) యేసు తన శిష్యులతో కూడా సముద్రము నొద్దకు వెళ్ళగా, గలిలయ నుండి వచ్చిన గొప్ప జనసమూహము ఆయనను వెంబడించెను, మరియు ఆయన ఇన్ని గొప్ప కార్యములు చేయుచున్నాడని విని జనులు యూదయనుండియు... యేసు నొద్దకు గుంపులు గుంపులుగా వచ్చిరి.

(మార్కు 6:53-56) జనులు యేసును గురుతుపట్టి, పరుగెత్తుకొని పోయి, అయనున్న చోటునకు రోగులను మంచము మీద మోసుకొని వచ్చుటకు మొదలుపెట్టిరి. రోగులను వీధులలో ఉంచి, యేసు వస్త్రపు చెంగు మాత్రము ముట్టనిమ్మని ఆయనను వేడుకొనుచుండిరి.

పై మాటలను బట్టి ఆయనను వెంబడించిన ప్రజలందరూ తమ అవసరాలను తీర్చుకొనుటకే తప్ప ఆయనను విశ్వసించటానికి కాదని ఖచ్చితంగా అర్ధమగుచున్నది. సమాజంలోని వారి రోగాలు తీయడానికీ అనగా వారి శరీర అవసరతలు తీర్చుకోడానికే బోధకులు, ప్రజలు క్రీస్తును ఉపయోగించుకొనుచున్నారు గాని ఆయన కొరకు శ్రమపడటం అటు ప్రసంగీకులకుగాని ఇటు క్రైస్తవ భక్త కోటికి గాని ఏ మాత్రమూ ఇష్టము లేనట్లు తేటతెల్లమగుచున్నది.

అవసరాల కోసమే జనులు వెంబడించుచున్నారని వారికై విసిగిపోయిన యేసు స్వామి ఎలాంటి జాగ్రత్తలు తీసుకున్నాడో బైబిలు నుండి చూడండి. రోగాలను తీయటమే క్రీస్తు ముఖ్య ఉద్దేశం కాదుగాని సువార్త ప్రకటించుటే ఆయన ప్రధమ కర్తవ్యం.

(మార్కు 1:35-39) శిష్యులు యేసుతో - అందరూ నిన్ను వెదకుచున్నారని ఆయనతో చెప్పగా ఆయన ఇతర సమీప గ్రామములోనూ నేను ప్రకటించునట్లు వెళ్ళుదము రండి, ఇందు నిమిత్తమే గదా నేను బయలుదేరి వచ్చితినని వారితో చెప్పెను.

(యెషయా 61:1) ప్రభువగు యెహోవా ఆత్మ నా మీదికి వచ్చియున్నది. దీనులకు సువార్తమానము ప్రకటించుటకు యెహోవా నన్ను అభిషేకించెను.

సువార్త ప్రకటించుటయే యేసు ధ్యేయంగా పెట్టుకున్నాడు గాని వచ్చిన వారిని స్వస్థపరచాలని, వారి అవసరతలు తీర్చాలని కాదు. రోగాలను తీసెయ్యడం యేసు ఉద్దేశ్యం ఎప్పుడూ కాదుగాని నాశన కూపంలోని ఆత్మలకు నిత్యజీవం ప్రసాదించడమే ఆయన ప్రకటనలోని ముఖ్యాంశం. ప్రజలు తమ అవసరాలను ఆయన ద్వారా తీర్చుకోవడానికి వస్తున్నారని గ్రహించి యేసు ఎటువంటి జాగ్రత్తలు పాటించారో చూడండి.

(మార్కు 1:45) కుష్టు రోగి వెళ్ళి తన  స్వస్థత గూర్చి విస్తారముగా ప్రకటించుటకును, ఆ సంగతి ప్రచురము చేయుటకును ఆరంభించెను గనుక ఆయన ఇక పట్టణములో బహిరంగముగా ప్రవేశింపలేక వెలుపల అరణ్య ప్రదేశములోనుండెను

(మార్కు 3:10-12) తన్ను ప్రసిద్ధి చేయవద్దని యేసు వారికి గట్టిగా ఆజ్ఞాపించెను.

(మార్కు 5:43) జరిగిన స్వస్థత ఎవనికి తెలియ కూడదని ఆయన వారికి గట్టిగా ఆజ్ఞాపించెను.

(యోహాను 12:37) యేసు వారికి కనబడకుండ దాగి యుండెను. బైబిలు లోని ఈ సందర్భాలలోని సారాన్ని మనము ఆలోచించినట్లైతే ప్రజలు తమ అవసరాలను తీర్చుకోడానికే ఆయనను నమ్మినట్లు, వెంబడించినట్లు అర్ధమగుచున్నది అందుకొరకే తన వివరాలను ప్రకటించవద్దని ఆజ్ఞా పూర్వకముగా వారికి చెప్పి వారికి కనబడకుండా ఆయన దాగుకున్నాడు. ఎందుకనగా ప్రజలు తమ అవసరాలను తీర్చుకొనుటకే తమ యొద్దకు రావడం, తనను నమ్మటం ఆయనకు ఇష్టం లేదు. క్రైస్తవుల మరియు బోధకుల స్థితియు అనాటి సమాజాన్ని నేడు అద్దంలా ప్రతి బింబింపజేస్తున్నారు.

క్రైస్తవుడా నీవు క్రీస్తును నమ్ముకొనుట కేవలం, అవసరాల కొరకో లేదా ఏదో ఒక మేలు జరుగుట కొరకో అయితే

అట్టి విశ్వాసం నిష్ఫలమైనది. క్రీస్తుపై ఆయన వాక్యాన్ని బట్టి నీకు నమ్మిక ఏర్పడాలే గాని మేలు జరిగినందునో, లేదా జరుగుబోతున్నదనో నీవు నమ్మకూడదు.

(2కొరింథీ 5:6) వెలిచూపు వలన కాక విశ్వాసము వలననే నడచు కొనుచున్నాము.

ప్రజల కన్నులకు సూచక క్రియలు, మేలులు కనబడినప్పుడే వారు క్రీస్తును నమ్ముట వ్యర్థం. అనాటి క్రైస్తవులు మేలు జరిగినా, జరుగకపోయినా, రక్షించకపోయినా, వెలిచూపును బట్టి కాకుండా విశ్వాసము బట్టి నడచుకొనుచున్నారని పౌలు భక్తుడు సాక్ష్యమిచ్చుచున్నాడు. నేటి తరం మేలు కలిగితేనే, నమ్మేవారుగా మారిపోయారు గాని నిజముగా ఏ మేలూ అనుభవించకపోయినప్పటికీ నీవు క్రీస్తును నమ్మితే అది నిజమైన విశ్వాసం.

(యోహాను 20:28) తోమాతో యేసు నీవు నన్ను చూచి నమ్మితివని, చూడక నమ్మినవారు మరి ధన్యులని అతనితో చెప్పెను.

క్రీస్తును నమ్ముటకు నీ కన్నులకు ఆధారాలు, నీ బ్రతుకులో మేలులు అవసరమైతే అలా నమ్మిన నీకన్నా క్రీస్తులేని ఈ కాలంలో, ఆయనను నమ్ముటకు ఎటువంటి సూచక క్రియలు జరుగకపోయినా, మేలులు కలుగకపోయినా ఒకరు క్రీస్తునందు విశ్వసించగలిగిన వారే ధన్యులని క్రీస్తే సాక్ష్యమిచ్చుచున్నాడు. ఒకరు దేవుని దృష్టియందు విశ్వాసిగా లెక్కింపబడాలంటే చూడకుండా నమ్మే స్థితిని నేటి క్రైస్తవులు కలిగి ఉండాలి. క్రీస్తును నమ్మిన క్రైస్తవులు ఆయనను చూడకపోయినా, పరలోకం పాతాళం, దూతలను చూడకపోయినా ఆయన కొరకు బ్రతకటమే నిజమైన క్రైస్తవ్యం. కేవలం క్రీస్తును గూర్చిన సందేశం వాక్యం విని కలిగిన విశ్వాసమే నిజమైన విశ్వాసమని బైబిలు ఘోషించుచున్నది.

(రోమా 10:17) కాగా వినుట వలన విశ్వాసము కలుగును; వినుట క్రీస్తును గూర్చిన మాట వలన కలుగును.

క్రీస్తును గూర్చిన సందేశాలు వినినప్పుడు నీకు విశ్వాసము కలుగకుండా, నీ బ్రతుకులో జరిగిన జరుగుచున్న మేలులను బట్టి నీవు విశ్వసించగలిగితే, అట్టి విశ్వాసము క్రీస్తు యెదుట సరియైనది కాదని మొదట తెలుసుకొనవలెను. క్రీస్తు గూర్చిన మాటే నీ మనస్సును మార్చలేనప్పుడు, సృష్టిలో మరి ఏది నిన్ను క్రీస్తులో స్థిరపరచలేదని తెలుసుకొనుట మంచిది కేవలం తమ అవసరాల నిమిత్తం విశ్వసించిన వీరు క్రీస్తు మాటలకన్నా తమ అవసరాలపైనే ఎంత మక్కువ కలిగి ఉన్నారన్నది ఆలోచించవలసిన విషయం. మనిషి చేరేది ఉన్నతమైన ఆత్మల లోకం, అటువంటి లోకానికి చేర్చేది ఆత్మ సంబంధమైన మనస్సే గాని, భూమి మీద శరీర సంబందమైన మనస్సు ఎన్నటికీ కాదు.

(గలతీ 3:23) ఇది మాత్రమే మీ వలన తెలుసుకొనగోరుచున్నాను, ధర్మశాస్త్ర సంబంధ క్రియల వలన ఆత్మను పొందితిరా? లేక విశ్వాసముతో వినుట వలన పొందితిరా? మీరింత అవివేకులైతిరా? మొదట ఆత్మానుసారముగా ఆరంభించి, యిప్పుడు శరీరానుసారముగా పరిపూర్ణులగుదురా?

క్రైస్తవ్యం ఆత్మ సంబంధంగా ప్రారంభమై ఆత్మీయంగా ముగియవలసి ఉండగా శరీర కోరికలను తీర్చుకొనుటకై పరిమితమైన వారిపట్ల ఆనాడు పౌలు వారిని హెచ్చరిస్తూ శారీరకంగా వారు దిగజారిన స్థితిని చూచి కల చెందుతున్నట్లు కనపడుచున్నది శరీరంలో మేలు పొందుటకే అయినట్లయితే క్రీస్తు తన జీవిత కాలంలో శరీర సంబంధముగా ఏం మేలులు పొందాడో మనందరికీ తెలుసు.

(హెబ్రీ 5:7,8) శరీరధారియైయున్న దినములలో మహారోదనముతోనూ కన్నీళ్ళతోనూ, తన్ను మరణము నుండి రక్షింపగలవానికి ప్రార్థనలను యాచనలను సమర్పించి, భయ భక్తులు కలిగియున్నందున ఆయన అంగీకరింపబడెను క్రీస్తు కుమారుడై యుండి తాను పొందిన శ్రమల వలన విధేయత నేర్చుకొనెను.

మరి శరీరధారులుగా క్రీస్తులో ఉన్న క్రైస్తవుల బ్రతుకులలో దేవుని కొరకు రోదనలు గాని, కన్నీళ్ళుగాని శ్రమలుగాని పొందుచున్నారేమో పరిక్షించండి. వారి కలతలు తీరలేదనే రోదనలు, వారి కుటుంబ పరిస్థితులు చక్కబడలేదనే కన్నీళ్ళు సుఖవంతమైన జీవితము కొరకైన శ్రమలే అనుభవించు చున్నారు గాని దేవుని కొరకు లేనే లేవు. శరీరాన్ని అనుసరించి

దేవునిలో వెంబడించేవారి స్థితి పాతాళము గతి కాక తప్పదు.

(రోమా 8:6-8) శరీరానుసారమైన మనస్సు మరణము, ఆత్మానుసారమైన మనస్సు జీవమును, సమాధానమునైయున్నది ఏలయనగా శరీరానుసారమైన మనస్సు దేవునికి విరోధమైయున్నది. శరీర స్వభావము గలవారు దేవునిని సంతోషపరచనేరదు.

నేటి క్రైస్తవులు ఇంకనూ శరీర సంబంధమైన అవసరాలతో దేవునిని వెంబడించినట్లయితే వారెన్నటికినీ దేవునిని సంతోష పరచలేరు. అదియూ గాక వారి చివరి స్థితి - మరణం. తమ అవసరాల కొరకే దేవుని నమ్మినవారు లేక అస్థిత్వాన్ని స్వీకరించినవారు క్రైస్తవులు కానేరరు. మేలులు పొందుచున్నందుకు మాత్రమే గాక తమ ఆత్మలకు నిత్యజీవాన్ని ప్రసాదించగలడన్న నమ్మకం తన పిల్లలు కలిగి ఉండాలని కోరుకుంటున్నాడు దేవాది దేవుడు. తన కొరకు బ్రతకడంలో చివరకు తమదంతా యోబులా సమస్థాన్ని కోల్పోయినా, విశ్వాసాన్ని విడవని వారిగా ఉండాలన్నదే దేవుని అభీష్టం. దేవుని వలన మేలు జరిగినా, జరుగకపోయినా తనలో స్థిరులుగా, కదలనివారుగా మనం ఉండాలని ఆయన ఆశించుచున్నాడు గనుక తండ్రి మనస్సును ఎరిగిన వారముగా ఆయన ఉద్దేశాలను నెరవేర్చడానికి సిద్ధపడినదే అసలు సిసలైన క్రైస్తవ్యం. (రోమా 12:2) ఈ లోక మర్యాదను అనుసరింపక ఉత్తమమును, అనుకూలమును, సంపూర్ణమునై యున్న దేవుని చిత్తమేదో పరీక్షించి తెలుసుకొనుడి.

గనుక క్రైస్తవులుగా పిలువబడుతున్నవారు దేవుని ఉద్దేశాల ప్రకారం ప్రవర్తించుటకు గానూ తమ్మును తాము ప్రత్యేక పరచుకోవాలేగాని మేలులు పొందుటకు మాత్రం కాదు. అదే విధంగా ఇక మీదట క్రీస్తును నమ్మేవారు కూడా మేలులు జరిగాయి గనుక క్రైస్తవులుగా మారారన్నది బైబిలుకు విరుద్ధం. మేలు జరుగుతాయని నమ్మడం ఎంత అపరాధమో మేలులు పొందుతారని నమ్మించడమూ అంతే నేరము గనుక నీవు క్రీస్తులోనికి ఆహ్వానించిన వారినెవరినైనా శ్రమల కొరకు సిద్ధపడే రావలసినదిగా ముందుగా వారికి తెలుపవలెను.

(1థెస్స 3:1-4) మేము మీ యొద్ద ఉన్నప్పుడు, మనము శ్రమ అనుభవింపవలసి ఉన్నదని మీతో ముందుగా చెప్పితిమి గదా, అలాగే జరిగినది అట్టి శ్రమలు అనుభవించుటకే మనము నియమింపబడిన వారమని వీరెరుగుదురు గనుక ప్రియ క్రైస్తవ సోదరులారా, మనము శ్రమనొందుట ఎంత ఖచ్చితమో ముందుగానే నమ్మేవారికి చెప్పి క్రీస్తులోనికి తీసుకొని వచ్చుట ఎంతో మేలుగాని మీకు మేలులు జరగడానికి క్రీస్తును నమ్ముకోండి అని చెప్పుట అపరాధమే అవుతుంది గనుక ఇకమీదట క్రీస్తును నమ్మేవారు అవసరాల కొరకు మాత్రం కాక నిజముగా శ్రమించుటకు సిద్ధపడినవారే అసలు సిసలైన క్రైస్తవులు, వారిదే నిజమైన క్రైస్తవత్వం, క్రీస్తుతత్వం.